Ek Insaan - Do Kirdaar
(Telugu)

# ఒక మనిషి - రెండు వైఖరులు

రచన:
**మాయిల్ ఖైరాబాదీ**

అనువాదం:
**ఇక్బాల్ అహ్మద్**

*అనంత కరుణామయుడు అపార కృపాశీలుడయిన అల్లాహ్ పేరుతో*

# ఒక మనిషి - రెండు వైఖరులు

1947కు ముందు జరిగిన సంఘటన. మన దేశంలో ఓ చిన్న రాజ్యానికి చెందిన రాజు 'తన రాజ్యంలో అందరికన్నా ఎక్కువ వయసు కలవాడయిన వృద్ధుడ్ని తన ఎదుట హాజరుపర్చమని' ఆజ్ఞ జారీచేశాడు. రాజుగారి ఆదేశంతో భటులు రాజ్యంలో నలువైపులా తిరుగుతూ అన్వేషణ మొదలుపెట్టారు. చివరికి నావ నడిపేవాడొకడు దొరికాడు. అతను బాగా ముసలివాడు. అతడి కనురెప్పలు కూడా తెల్లబడ్డాయి. కనురెప్పల చర్మం సాగిపోయి కళ్ళకు అడ్డంపడుతోంది. సిపాయిలు ఆ వృద్ధుడ్ని రాజుగారి ముందు ప్రవేశపెట్టారు. అక్కడ అతని పేరు, వృత్తి, జన్మస్థలం, పుట్టిన సంవత్సరం వగైరా ప్రశ్నించడం జరిగింది. అతడు తను పుట్టిన సంవత్సరం చెప్పలేకపోయాడు కాని తాను నవాబుల పాలనను చూశాననీ, స్వాతంత్ర్య పోరాటం నాటికి నిండు యవ్వనంలో ఉన్నానని తెలియజేశాడు. తన రాజ్యంలో అత్యంత వృద్ధుడు ఇతడే అని రాజుకి నమ్మకం కుదిరింది. అప్పుడు రాజుగారు అతడ్నిలా ప్రశ్నించాడు:

"నువ్వు గతకాలాన్ని చూశావు. ఈనాడు ఏం జరుగుతుందో కూడా చూస్తున్నావు. గత కాలానికీ, ఈనాటి కాలానికి నీకేమయినా తేడా కనిపిస్తోందా?"

దానికి ఆ వృద్ధుడు ఇలా సమాధానమిచ్చాడు:

"మహాప్రభో! అదే భూమి ఇప్పుడూ వుంది. ఆనాటి ఆకాశమే ఇప్పుడూ వుంది. గాలి కూడా అదే విధంగా వీస్తోంది. ప్రభూ! వంద ఏళ్ళకు పూర్వం నుండీ ఈ నదిలోని నీళ్ళను చూస్తున్నాను. నేను నావల్ని నడుపుతూవుంటాను. నదిలో నీళ్ళు కూడా నా చిన్నప్పుడు ఎలా ప్రవహిస్తున్నాయో ఇప్పటికీ అలాగే ప్రవహిస్తున్నాయి. మహారాజా! భూమీ ఆకాశాల మధ్య వున్నదంతా యథాతథంగానే వుంది. కాని........" చెబుతూ చెబుతూ ఆ వృద్ధుడు రాజు వంక చూశాడు. తెరలు తెరలుగా దగ్గుతూ చెప్పడం ఆపాడు.

"కాని... ఇంతకూ నీవు ఏం చెప్పదల్చుకున్నావు?" రాజుగారు ఉండబట్ట లేక అడిగాడు. "మన ఉద్దేశ్యాలలో, సంకల్పాలలో మాత్రం పెద్ద తేడా వచ్చింది" అన్నాడు వృద్ధుడు. "ఏమిటా తేడా!?" రాజు ఆశ్చర్యపోతూ అడిగాడు.

"ప్రభూ! నేను ఇతరులను గురించి ఏమీ చెప్పను. నా విషయంలో జరిగిన సంఘటనల్ని మాత్రం వివరిస్తాను. అవి ఇప్పటికీ నాకు గుర్తున్నాయి. దాన్నిబట్టి మన సంకల్పాలలో ఎలాంటి మార్పు వచ్చిందో మీరే గ్రహించగలరు" అంటూ ఇలా వివరించడం మొదలుపెట్టాడా పండుముసలి:

"అయ్యా! నేను నదిలో నావలు నడిపేవాడ్నని చెప్పాను గదా! ఆ కాలంలో జరిగిన మొదటి సంఘటన. నాకు పెళ్ళయిన తొలి రోజులవి. నా పెళ్ళి కోసం మావాళ్ళు డబ్బు బాగా ఖర్చుపెట్టారు. దాంతో మా నాన్న అప్పులపాలయ్యాడు. అప్పులు తీర్చలేక సతమతం కాసాగాడు. ఆయన దిగులు ప్రభావం నాపైనా పడింది. ఆ కాలంలోనే ఓ రోజు రాత్రి బాగా ప్రొద్దుపోయాక నేను నది ఒడ్డునగల నా గుడిసెలో పడుకోబోతుంటే ఒక బాటసారి వచ్చి నన్ను కేకేశాడు. నేనతడ్ని అర్ధరూపాయి అడిగాను. అసలే ఆ సమయంలో నేను బాగా అలసిపోయి వున్నాను. పని చేసే ఓపిక నాలో నశించింది. విశ్రాంతి తీసుకోవాలనుకున్నాను. అందువల్ల అర్ధరూపాయి అడిగితే ఆ ఆసామి తిరిగి వెళ్ళిపోతాడులే అని నేను భావించాను. కాని ఆ ఆసామి అంగీకరించాడు. ప్రభూ! ఆ రోజుల్లో ఆ పనికి ఒక అణా ఇస్తే సరిపోతుంది. అతడ్ని వదిలించుకోవాలని నేను ఎక్కువ అడిగాను. బహుశా ఏదో అత్యవసరపు పని మీద పోతున్నాడేమో అర్ధరూపాయి ఇవ్వడానికి సిద్ధమయ్యాడు. ఆ రోజుల్లో అర్ధరూపాయి అంటే చాలా పెద్ద బేరం.

అతనెటూ అంగీకరించాడు. నేను మాట మార్చలేను కదా. అయ్యా! ఆ రోజుల్లో మాట అంటే మాటే. ఆరు నూరయినా ఇచ్చిన మాటకు కట్టుబడేవారు. మాట తప్పడం ఎన్నటికీ జరగని పని. అర్ధరూపాయి కోసంకాక అతనికిచ్చిన మాట కోసం నేను నావ బయలుదేరదీయక తప్పలేదు. గుడిసె నుండి లేచి నావ తాడు విప్పి సిద్ధం చేశాను. అతను సామానులు నావలో పెట్టుకున్నాడు. కూర్చుని ఇక పద అన్నాడు. చూస్తూ చూస్తూ ఉండగానే నావ చీకటిలో నీటిని చీల్చుకుంటూ కొద్దిసేపట్లోనే అవతలి ఒడ్డుకు చేరింది. అతడు సామానులు

గబాగబా దించుకుని అర్ధరూపాయి నా చేతిలో పెట్టాడు. అతడు తొందరలో వున్నట్లున్నాడు. నాకు డబ్బులివ్వగానే సామాను తీసుకుని రాత్రి చీకటిలో కలసి వెళ్ళిపోయాడు. నేను నావను కట్టేసి నా గుడిసెలో పడుకున్నాను. ఉదయం బాగా ఎండ కాశాక నావ దగ్గరకు వెళ్ళాను. తీరా చూస్తే దానిలో ఒక మూట కనిపించింది. దాన్ని పైకెత్తితే చాలా బరువుగా అనిపించింది. దాన్ని కదిలిస్తే గలగల రూపాయల మోత వచ్చింది. విప్పి చూస్తే అన్నీ రూపాయలే. వెండి రూపాయి నాణాలు. ప్రభూ! తమకు నిజం విన్నవించుకుంటున్నాను. నా సంకల్పంలో ఏ మాత్రం కృత్రిమత్వం లేదు. ఈ మూటని గుడిసెలో వుంచడం మంచిది కాదనుకున్నాను. నది ఒడ్డునే ఇసుకలో ఒక చోట దాచాను. ఇది రాత్రి వచ్చిన ఆసామిదే అని భావించాను. అతడు తప్పకుండా మూట కోసం వస్తాడని అప్పుడు అతనికి వాపసు చేద్దామని తలచాను.

కొద్దిసేపటికి ఆ మనిషి కంగారుగా వస్తూ కనిపించాడు. వచ్చీరాగానే మూట గురించి అడిగాడు. వెంటనే నేను ఇసుకలో దాచిన మూట బయటికి తీసి అతనికి అప్పగించాను. అతడు ఎంతగానో సంతోషించాడు. అతడి సంతోషం చూసి నాకూ సంతోషం కలిగింది. అయ్యా! ఆ రోజుల్లో ఇతరుల్ని సంతోషంలో చూసిన ప్రజలు కూడా సంతోషించేవారు. ఇప్పుడు, ఎవరయినా తింటూ వుంటే, తెల్లబట్టలు కట్టుకుంటే చూసినవాళ్ళు ఓర్వలేరు. పైగా అసూయాగ్నిలో మండిపోతారు. సరే, అతడు నాకు కొన్ని రూపాయలు బహుమానంగా ఇవ్వ బోయాడు. నేను తిరస్కరించాను. "ఈ రూపాయలే తీసుకోవాలనుకుంటే, ఇవన్నీ నా చేతిలోనే వున్నాయి. నాకీ బహుమానం అక్కరలేదు" అన్నాను.

ఇక నా రెండో గాథ వినండి. చాలా రోజులు గడిచిపోయాయి. నేను యవ్వనం దాటి వృద్ధాప్యంలోకి ప్రవేశించాను. వయసు యాభయి దాటింది. ఇంటికి పెద్ద దిక్కుని నేనే. నవాబుల పాలన అంతమయ్యింది. విప్లవం చల్లబడి ఆంగ్లేయుల పెత్తనం వచ్చింది. మా అదృష్టం వాళ్ళ చేతుల్లో వుంది.

ఆ రోజుల్లోనే జరిగిన సంఘటన. కొందరు నా పడవలో ఎక్కి ఒడ్డుకు చేరుకున్నారు. వాళ్ళు తమ సామాను తీసుకుని వెళ్ళిపోయారు. నావలో నాకొక సున్నపు డబ్బా కనబడింది. దాని ఖరీదు అర్ధణాకు మించదు. నేనా డబ్బా

తీసుకుని ఇంటికి చేరుకున్నాను. గత సాయంత్రం నా నావ ఎక్కి అవతలకు వెళ్ళినవారిలో ఒకతను వచ్చి, "బాబూ! నిన్న సాయంత్రం నా సున్నపు డబ్బా పోయింది. మీకేమయినా దొరికిందా?" అని అడిగాడు.

"లేదు. నాకు దొరకలేదు" అంటూ నేను పచ్చి అబద్ధమాడాను. చూశారా! నా తండ్రి అప్పుల ఊబిలో కూరుకునివున్న రోజుల్లో వేలాది రూపాయల్ని నేను తృణప్రాయంగా భావించాను. మరి ఈనాడు ఒక అల్పమయిన వస్తువు కోసం నా చిత్తశుద్ధిని పాడుచేసుకున్నాను.

ప్రభూ! నా జీవితంలోని రెండు సంఘటనల్ని వివరించాను. వీటిని బట్టి మీరు అంచనా వేయవచ్చు. ఇతరుల్ని కూడా చూడండి. అప్పుడున్న భూమి ఇప్పుడూ వుంది. అప్పుడున్న ఆకాశమే ఇప్పటికీ వుంది. భూమీ ఆకాశాల మధ్య వున్నదంతా యధాతథంగా వుంది. సూర్యచంద్రుల గమనంలో ఎటువంటి తేడా లేదు. కాని మన సంకల్పాలు, ఉద్దేశ్యాలు మాత్రం మునుపటిలా లేవు.

దీని ఫలితంగానే మన పనుల్లో శుభం తగ్గిపోతూంది. మనం వీలయినంత ఎక్కువ సంపాదిస్తున్నా మన అవసరాలు తీరడం లేదు. ఎవరిని చూసినా ధనవ్యామోహంలో పిచ్చివాడవుతున్నాడు. లంచం, దొంగతనం, మోసం, కుట్ర ఇంకా ఇలాంటి చర్యలే వృద్ధి చెందుతున్నాయి. కాని ఎవరికీ సుసంపన్నత అనుభవించే భాగ్యం దక్కడం లేదు. ప్రభుత్వాల్ని చూడండి. ఎన్నో దీర్ఘకాల ప్రణాళికలు రచిస్తున్నాయి. కాని ప్రతి పథకం విఫలమే అవుతోంది.

ఈ పథకాల ద్వారా జరిగే పనులు సమగ్రమైనవి కావు. ఈ సంవత్సరం ఒక వంతెన కట్టబడింది. ఈ సంవత్సరంలోనే వర్షాలకు కొట్టుకుపోయింది. ఎందుచేత? కంట్రాక్టర్‌లో చిత్తశుద్ధి లోపించింది. కట్టించేవారిలోనూ చిత్తశుద్ధి లోపించింది. ఎలాగోలా పైపై పూతలు చేసి బిల్లు పాస్ అయిపోతుంది. ఎవరి ముడుపులు వారికి, కథ కంచికే, అంతే.

అయ్యా! క్షమించండి. నేను అబద్ధం చెప్పడం లేదు. మీరు నాకన్నా బాగా ఎరిగిన విషయాలే ఇవి. ఇలా చెప్పి ఆ వృద్ధుడు మౌనంగా వుండిపొయ్యాడు. రాజు ఈ మాటలు విని సంతోషంతో అతడికి బహుమానం ఇచ్చి పంపించాడు.



# చిత్తశుద్ధి పోయింది

రాజు గారికి ఆ వృద్ధుడి మాటలు గుర్తు వస్తున్నాయి. అతడి మాటల గురించే ఆలోచిస్తున్నాడు. ఇలా ఆలోచిస్తుంటే అతని మస్తిష్కంలో ఒక ప్రశ్న తలెత్తింది. మనిషిలో చిత్తశుద్ధి ఎందుకు లోపించింది? దీనికి సమాధానం ఆలోచించాడు. రకరకాల విషయాలు అతడి బుర్రలో మెదిలాయి. కాని ఏ విషయమూ అతడ్ని తృప్తిపరచలేదు. ఎవరయినా తెలివిగలవాడు, అనుభవం కలవాడిని హాజరుపరచమని ఆదేశించాడు. వెంటనే సిపాయిలు రాజ్యమంతా గాలించి ఒక తెలివైనవాణ్ణి రాజు ఎదుట నిలబెట్టారు.

"ఒక మనిషి ప్రపంచంలో ఎంతో చిత్తశుద్ధితో, విశ్వసనీయతతో వుంటాడు. కొన్నాళ్ళకు అతడిలో చిత్తశుద్ధి లోపిస్తుంది. ఇలా ఎందుకు జరుగుతుంది?" అడిగాడు రాజు. దానికి ఆ మేధావి ఇలా జవాబిచ్చాడు.

"ప్రభూ! మనిషికి రకరకాల అవసరాలు ఉంటాయని మీకూ తెలుసు. వాటిలో కొన్నిటిని మనిషికి సృష్టికర్తే కల్పించాడు. అంటే ఆకలి వేసినప్పుడు ఆహారం అవసరమవుతుంది. వేడి, చలి నుండి కాపాడుకోవడానికి దుస్తులు అవసరం. నివసించడానికి ఇల్లు అవసరం. ఇంకా ఎన్నో ఇతర అవసరాలున్నాయి. మనిషి వాటి నుండి జీవితాంతం తప్పించుకోజాలడు. ఆ అవసరాల విషయంలో ధనికులు, దరిద్రులు, రాజు, ప్రజలు, చిన్నా పెద్దా అందరూ సమానులే.

అయితే ఈ అవసరాలకు భోగలాలస, మితిమీరిన కోరికలు తోడయి నప్పుడు మరికొన్ని అవసరాలు ఏర్పడుతాయి. ఇవి ధనికుల వాటాకు వస్తాయి. ఉదాహరణకు: ఖరీదయిన తిండి, రుచికరమైన పదార్థాలు, రకరకాల డిజైన్ల బట్టలు, అందమైన బంగళా, ప్రతి అవసరానికి వేర్వేరు గదులు, వివిధ రకాల సామగ్రి, విలాసవంతమైన వస్తువులు. నిజానికి ఇవి మౌలిక అవసరాలు కాకపోయినా భోగలాలస, మితిమీరిన కోరికలు వీటిని మౌలిక అవసరాల జాబితాలో చేర్చాయి. తనను తాను గొప్పవాణ్ణని భావించే లేదా తనను ఇతరులు గొప్పవాడని అనుకోవాలని తలచే మనిషి మాత్రమే భోగలాలసకు, మితిమీరిన కోరికలకు ఎక్కువగా బానిస అవుతాడు. ఈ భోగలాలస, మితిమీరిన కోరికలే మనిషి మననును పాడుచేస్తాయి. చిత్తశుద్ధి లోపించి స్వార్థం గూడు కట్టుకుంటుంది. దాంతో ఇంటి శుభాలు దూరమవుతాయి. శుభాలు దూరమైన

తరువాత మనిషి అవసరాలు, కోరికలు హద్దుపద్దూ లేకుండా పెరిగిపోతాయి. ఈ "పెద్ద మనిషి" పోకడలు చూసి ఇతరులు కూడా అతడ్ని అనుకరించడం మొదలెడతారు. ఈ విధంగా ఇతను స్వయంగా నాశనమవడమే గాకుండా ఇతరుల నాశనానికి కూడా కారణమవుతాడు. రాజా! మీరు అనుమతిస్తే నేనొక సంఘటన చెబుతాను. అది మనందరికీ గుణపాఠంగా కూడా అవుతుంది.

మేధావి ఇలా చెప్పి రాజుగారి సమాధానం కోసం ఎదురుచూడసాగాడు. రాజుగారు, "సరే, అలాగే చెప్పు. నేను నిన్ను పిలిపించింది కూడా అందుకే" అన్నారు. "నేను మిమ్మల్ని అనుమతి కోరడానికి కారణం, నేను ఓ రాజు గురించిన వృత్తాంతం చెప్పబోతున్నాను. ఈ వృత్తాంతం పుస్తకాలలో ఇలా వ్రాయబడివుంది" అంటూ మేధావి ఆ కథ చెప్పడం ప్రారంభించాడు:

ఆ రాజు ఒకసారి వేటకు బయలుదేరాడు. అడవిలో అతనికి ఒక లేడి కనిపించింది. ఆయన తన గుర్రాన్ని ఆ లేడి వెనుక పరుగుతీయించాడు. రాజా! శ్రోతలు ఆసక్తితో వినడానికి, నీతి గ్రహించడానికి పాత కథలు ఇలాగే ప్రారంభ మవుతాయి. సరే! ఆ రాజు లేడిని వేటాడాలన్న తపనతో తన పరివారానికి దూరంగా వెళ్ళిపోయాడు. ముందు ముందు లేడి పరుగెత్తుతుంటే దాని వెనుక రాజుగారు గుర్రం మీద వాయువేగంతో దౌడుతీస్తున్నాడు. లేడి అలా పరుగెత్తుతూ హఠాత్తుగా ఒక పొదలోకి దూరి మాయమైపోయింది. రాజు అప్పటికే బాగా అలసిపోయాడు. లేడి మాయమయ్యాక, విశ్రాంతి తీసుకోవడానికి చోటు కోసం వెదకసాగాడు. కొంచెం దూరంలో ఒక తోట కనిపించింది. ఆయన ఆ తోటలోకి ప్రవేశించాడు. రాజుగారికి బాగా ఆకలివేయసాగింది. దప్పిక కూడా అవుతోంది. ఆయన తోటమాలితో, "అయ్యా! నేనొక బాటసారిని. నా వాళ్ళు నా నుండి వేరయి పోయారు. తీవ్రమైన ఆకలిదప్పులతో వున్నాను. నన్ను మీ అతిథిగా భావించి తినడానికి, త్రాగడానికి ఏమయినా ఇవ్వండి" అని అన్నారు.

ఇంతవరకు చెప్పి ఆ మేధావి కాస్త ఆగి మరల చెప్పనారంభించాడు, రాజా! ఒకప్పుడు ప్రజలు తమ ఇంటికి ఎవరయినా అతిథి వస్తే ఎంతగానో సంతోషించేవారు. ఉన్నదాంట్లోనే మేలైన పదార్థాన్ని అతిథి ముందు వుంచేవారు. వీలైనంతవరకు అతిథి సేవలో ఏ లోటూ రానిచ్చేవారు కాదు. ఈనాటి మనుష లలో చిత్తశుద్ధి లోపించింది. అందువల్ల మన ఇండ్లలో శుభాలు కూడా లేకుండా

పోయాయి. ఎవరయినా అతిథి వస్తే ఇంట్లో అందరూ విసుక్కుంటారు. వచ్చిన వాడు ఎప్పుడు పోతాడా అని ఎదురుచూస్తారు. టీ తాగడానికి ప్రజలు అలవాటు పడిన తర్వాత అతిథికి టీ ఇచ్చి పంపేద్దామని భావిస్తున్నారిప్పుడు.

రాజా! ఆలోచించండి. ఈనాడు మన హృదయాలలో ప్రేమ ఎందుకు కలగడం లేదు? సరే, రాజుగారు తనకు తినడానికి ఏదైనా ఇవ్వమని తోటమాలిని అడిగాడు. తోటమాలి వచ్చిన అతిథిని చూడగానే సంతోషంతో పొంగిపోయాడు. వెంటనే అతిథి గుర్రాన్ని తీసికెళ్ళి ఒక చోట నీడలో కట్టేసి దాని ముందు మేత వేశాడు. ఆ తర్వాత అతిథి కోసం పక్క పరచి పరుగు పరుగున వెళ్ళి ఒక పాత్ర తీసుకున్నాడు. ఆ పాత్రతో ఒక దానిమ్మ చెట్టు క్రిందకు వెళ్ళి ఒక పండు కోసి రసం పిండాడు. ఆ ఒక్క పండు రసంతోనే పాత్ర నిండిపోయింది.

రాజుగారు ఇదంతా చూస్తూనే వున్నారు. ఒక్క పండుతోనే పాత్ర నిండా రసం రావడం చూసి ఆశ్చర్యపోయాడు. అతనలా చూస్తూ వుండగానే తోటమాలి ఆ పాత్రను రాజు ముందు వుంచాడు. రాజుగారు ఆ రసం త్రాగాడు. తోటమాలి మరో పండు కోసి దాని రసం కూడా పిండాడు. ఈసారి కూడా ఒక్క పండు రసంతోనే పాత్ర నిండిపోయింది. రాజుగారు రెండో పాత్ర కూడా ఖాళీ చేశారు. దాంతో ఆయన కడుపు నిండిపోయింది. తృప్తిగా పక్క మీద వాలారు.

రాజుగారు అలా పడుకుని ఆలోచించసాగారు. ఇక చూడండి హుజూర్! ఇలా ఆలోచించడమే చేటు తెచ్చింది. రాజ్యపాలన కోసం రకరకాల పన్నులు, శిస్తులు విధించవలసివస్తుంది. రాజుగారి బుర్ర పన్నుల విధింపు వైపునకు మళ్ళింది. ఈ తోటమాలి తోటపై కూడా పన్ను వేయాలన్న కోరిక పడగవిప్పింది. దాంతో ఆయనగారు కళ్ళు చించుకొని తోట వైపు తేరిపార చూడసాగారు. తోట ఎంత పెద్దదో, దాని వల్ల ఎంత ఆదాయం వస్తుందో, దాని మీద ఎంత పన్ను విధించవచ్చోనని ఆలోచించసాగారు.

ఇలా ఆలోచిస్తూ ఆయన నిద్రలోకి జారుకున్నారు. కాస్సేపటి తరువాత మేల్కొని, "సోదరా! దాహం వేస్తోంది. మరికాస్త దానిమ్మ రసం పిండివ్వు" అన్నారు. తోటమాలి సంతోషంగా లేచి పాత్ర తీసుకుని ఒక పండు కోశాడు. దాన్ని పిండే సరికి రసం ఏ మాత్రమూ రాలేదు. పండును చూస్తే అది లోపల ఎండిపోయి వుంది. తోటమాలి మరో పండు తెంచాడు. అది కూడా లోపల ఎండిపోయి వుంది. వేరొక పండు తెంచి చూస్తే అదీ ఎండిపోయి ఉంది. అలా

దాదాపు పాతిక పండ్లు తెంచిన తర్వాత అతి కష్టం మీద సగం పాత్ర నిండింది. దాన్నే అతిథి ఎదుట వుంచి ఏదో ఆలోచిస్తూ అలాగే నిల్చుండిపోయాడు.

ఈ తమాషా అంతా రాజగారు గమనిస్తూనే ఉన్నారు.

"సోదరా! ఏమిటీ ఆలోచిస్తున్నావు?" అన్నారు ఆయన. "మీరీ దేశానికి రాజయి ఉంటారని అన్పిస్తోంది నాకు. ఇప్పుడు మీ సంకల్పంలో ఏదో దోషం ఏర్పడింది. బహుశా నా తోట మీద పన్ను వేయాలని ఆలోచిస్తున్నారనుకుంటా" అన్నాడు తోటమాలి.

తోటమాలి మాటలు విని రాజుగారు దిగ్భ్రాంతి చెందారు. "తోటమాలికి తన మనసులోని విషయం ఎలా తెలిసింది? హృదయాల్లో దాగివుండే విషయాలు దైవానికి తప్ప మరెవరికీ తెలియదే! ఈ తోటమాలికి ఎలా తెలిసింది?" రాజుగారు ఇలా ఆలోచిస్తూ, "అవును నేను రాజునే. నేనిప్పుడు నీ తోటపై పన్ను విధించాలని కూడా ఆలోచిస్తున్నాను. కాని నేను రాజునని నీవెలా గ్రహించావు? నా మనసులోని మాటలు నీకెలా తెలిశాయి?" అని అడిగారు.

"ప్రభూ! ప్రాణభిక్ష పెడతానంటే చెబుతాను. వాస్తవం ఏమంటే, తమరు రాగానే మొదటిసారి దానిమ్మ పండుని తెంచినప్పుడు మీ సంకల్పం బాగానే ఉండింది. దాని శుభం వల్ల ఒకే ఒక పండు రసంతో పాత్ర నిండిపోయింది. కాని ఇప్పుడు నేను పాతిక పండ్లు పిండినా రసం సగం పాత్రకే వచ్చింది. అప్పుడు నాకు పెద్దల మాట గుర్తు వచ్చింది. "రాజు సంకల్పం బాగుంటే దేశంలో ప్రతీదీ సమృద్ధిగా వుంటుందని, రాజు సంకల్పంలో దోషం పుట్టుకువస్తే దేశంలో శుభం మాయమవుతుందని" నేను పెద్దల ద్వారా విన్నాను. ఇప్పుడు దానిమ్మ పండ్లలో రసం లేకపోయేసరికి నా అతిథి రాజయి ఉంటాడని, ఆయన సంకల్పంలో దోషం ఏర్పడినందువల్లే దానిమ్మ పండ్లల్లో శుభం లేకుండా పోయిందని నాకు అన్పించింది" అన్నాడు తోటమాలి.

ఈ మాట విని రాజుగారు సిగ్గుపడిపోయి పన్ను విధించే ఆలోచనను మానుకున్నాడు. ఆ తర్వాత తోటమాలితో "సరే, ఇప్పుడు వెళ్ళు. ఒక్క దానిమ్మ పండు రసం తీయి" అని అన్నాడు. తోటమాలి వెళ్ళి ఒక దానిమ్మ పండు తెంచి రసం పిండాడు. ఈసారి పాత్ర నిండిపోయింది. రాజుగారికి నమ్మకం కుదిరింది. నిజం చెప్పాలంటే రాజు ఎంత పుణ్యాత్ముడయితే దాని ప్రభావం కూడా అతని రాజ్యంపై అంతే పడుతుంది. ప్రతి వస్తువులో శుభం కలుగుతుంది.

ఈ సంఘటనను వివరించాక ఆ మేధావి కాస్సేపు ఆగి తిరిగి ఇలా చెప్పడం మొదలెట్టాడు:

"చూశారా మహారాజా! రాజులకు, చక్రవర్తులకు ఎన్నో అవసరాలు ఉంటాయి. కాని వాటి కోసం ఎన్ని విధాల పన్నులు విధించినా వారి అత్యాశ తగ్గదు. కాగా అదింకా పెరుగుతూనే ఉంటుంది. ఫలితంగా ప్రజలు పీడనకు గురవుతారు. పూర్వం ఒకతను తన కోరికలు ఎన్నో తీరాయి, అయినా చాలా తక్కువగా తీరాయని అన్నాడట. ఇలాంటివారు తమను గొప్పవారుగా భావించుకుని రకరకాల వస్తుసామగ్రిని సమకూర్చుకుంటారు. అయినప్పటికీ తమ వద్ద వస్తువులు చాలా తక్కువగా వున్నాయని భావిస్తారు.

రాజా! ఇప్పుడు మీరు వాస్తవం తెలుసుకున్నారు కదా! అవసరం మనిషిలో కోరికల్ని పుట్టిస్తుంది. ఈ అవసరాల కోసం ఆడంబరాలకు పోతే అత్యాశ హద్దులు దాటి పోతుంది. ఈ అత్యాశే ఇతరులపై దౌర్జన్యాన్ని ప్రదర్శిస్తుంది. ఈనాడు నలువైపులా మీరు చూస్తున్న వాతావరణం పాలకుల అత్యాశ ఫలితమే.

మన పెద్దలు చెప్పింది నిజం. హాయిగా జీవించాలంటే అత్యాశకు పోకుండా మన అవసరాలను తగ్గించుకోవాలి. అవసరాల్ని తగ్గించుకుంటే కోరికలు బహుకొద్దిగా జనిస్తాయి. అటువంటప్పుడు సంకల్పంపై అతికొద్ది ప్రభావం మాత్రమే పడుతుంది. కనీస ప్రభావం పడినప్పుడు సంకల్పాన్ని అదుపులో వుంచుకోవడం సులభం అవుతుంది. సంకల్పం అదుపులో లేకుంటే మరిక ఆ దేవుడే దిక్కు."

మేధావి ఈ సంఘటన ద్వారా గుణపాఠం నేర్పి మౌనందాల్చాడు. రాజుగారు ఎంతో సంతోషించాడు. మేధావికి బహుమానం ఇవ్వబోతే అతడు ఇలా అన్నాడు: "రాజా! దైవం నాకు ఎంతో ఇచ్చాడు. తమరు ఈ బహుమానాన్ని పేదలకు పంచి వారి ఆశీర్వాదం పొందటం ఉత్తమం అని నా అభిప్రాయం."

ఇది విన్న రాజు ఎంతో సంతోషించాడు. మేధావికి అత్యంత గౌరవ మర్యాదలతో వీడ్కోలు పలికాడు. అతడు వినిపించిన సంఘటనలోని గుణపాఠాన్ని గురించి ఆలోచించసాగాడు.



# పేరాశ

మేధావి చెప్పిన మాటల్ని పరిశీలించినకొద్దీ రాజుకు ఎన్నో కొత్త విషయాలు అర్థమయ్యాయి. అవసరాలు పెరిగినకొద్దీ ఆడంబరాలు అధికమయి మనిషిలో పేరాశ గూడు కట్టుకుంటుంది. ఆ పేరాశ సంకల్పాన్ని పాడుచేస్తుంది. సంకల్పదోషం వల్ల శుభం అంతరిస్తుంది అన్న విషయం మాత్రం అర్థమయింది. కాని సంకల్ప దోషం వల్ల లేక అత్యాశకుపోయి మనిషి తానూ నాశనం అవుతాడు, ఇతరుల వినాశానికీ కారణం అవుతాడు అన్న విషయమే రాజుకు అర్థం కాలేదు. సంకల్ప దోషం వల్ల రెండు రకాలుగా నష్టం ఎలా కలుగుతుందీ? మహాఅయితే అత్యాశకు పోయినవాడు తానొక్కడే నాశనం అవుతాడు. ఎంత ఆలోచించినా రాజుకు విషయం అర్థం కాలేదు. ఆ మేధావిని మరొకసారి పిలుచుకురమ్మని ఆజ్ఞాపించాడు. సిపాయిలు పరుగున వెళ్ళి అతడ్ని పిలుచుకువచ్చారు. రాజు అతడ్ని గౌరవించి కూర్చోబెట్టి ఇలా అన్నాడు:

"సంకల్ప దోషం వల్ల మనిషి తానూ నాశనం కావడంతోపాటు ఇతరుల నాశనానికీ కారకుడవుతాడు అని తెలిపే ఉదాహరణ ఏదయినా చెప్పండి."

మేధావి ఇలా చెప్పాడు: "రాజా! అయితే వినండి. మా గురువుగారు చెప్పిన విషయమే చెబుతాను. మా గురువుగారు గొప్ప పండితుడు. ఆయన గొప్ప గొప్ప ధర్మశాస్త్రాలు చదివారు. ఆయన ఖుర్ఆన్‌కు సంబంధించిన విషయాలు ఎరిగినవారు. వేదాలూ చదివారు. తౌరాత్, ఇంజీలు గురించి కూడా ఆయనకు పరిచయం వుంది. ఆయన నోట మీరు గనక విన్నారంటే భలేగా వుంటుంది. గుణపాఠమూ లభిస్తుంది."

రాజు ఈ మాట విని, "ఆయన ఎక్కడుంటారు?" అని అడిగాడు.

"ఆయన ఇక్కడ్నుంచి ఇరవై కిలోమీటర్ల దూరంలోని ఒక కొండపై వుంటారు. రేయింబవళ్ళు దైవారాధనలో గడుపుతారు. వారంలో రెండుసార్లు ప్రజలను కలుసుకుంటారు. గొప్ప గొప్ప హితవచనాలు, గుణపాఠాలు గరుపుతూ వుంటారు. రాజా! వృద్ధాప్యం కారణంగా ఆయన ఇక్కడకు రాలేరు. తమరే ఆయన దగ్గరకు పోయినట్లయితే, తమ సంకల్పంలోని మంచితనం ప్రభావం

ప్రజలపై కూడా పడుతుంది. అలా షికారుగా పోయినట్లు కూడా అవుతుంది" అన్నాడు మేధావి.

రాజు ఈ మాట విని వెంటనే బయలుదేరాలని ఆదేశించాడు. కొంతమంది నౌకర్లతో, ప్రయాణ సామగ్రితో బయలుదేరాడు. మేధావి కూడా ఆయన వెంట వున్నాడు. అందరూ సాయంత్రానికల్లా పండితుడు ఉండే కొండ దగ్గరకు చేరుకున్నారు. మరుసటి రోజు ఉదయమే పండితులవారు ఉపన్యసించే రోజని తెలిసి చాలా సంతోషం కలిగింది. మరునాడు తెల్లవారేసరికి నలు మూలల నుండి జనం వచ్చి చేరసాగారు. చూస్తూ ఉండగానే మైదానం అంతా మనుషులతో నిండిపోయింది. సూర్యుడు కాస్త పైకి రాగానే పండితులవారు కొండ దిగి వచ్చారు. ఆయన ఉపన్యాసం ఇచ్చారు. ఆ తర్వాత ప్రజలు రకరకాల ప్రశ్నలు అడిగారు. పండితులవారు వాటన్నింటికీ సమాధానాలు ఇచ్చారు. చివరగా రాజుగారు, "సంకల్ప దోషం వల్ల మనిషి తానూ నాశనం అవుతాడు, ఇతరుల నాశనానికీ కారణం అవుతాడు అన్నదానికి ఏదయినా ఉదాహరణ చెప్పండి" అని అడిగాడు.

పండితులవారు రాజుగారి వంక ఓసారి చూసి ఇలా అన్నారు:

"ప్రజలారా! మీరంతా వినండి, నేనొక కథ చెబుతాను, శ్రద్ధగా వింటే ఇందులో మీకు గొప్ప నీతి లభిస్తుంది. పూర్వకాలంలో మన పెద్దలు హితబోధ కోసం ప్రజలకు నీతి కథలు చెప్పేవారు. చెప్పవలసిన నీతి చుట్టూ ఓ కథ అల్లేవారు. ప్రజలు ఆ నీతి కథల్ని ఆసక్తిగా వినేవారు. మీ ఈ సోదరుడు అడిగిన విషయానికి సంబంధించి ఒక నీతి కథ వుంది. ఈసా (అలై) దైవప్రవక్త, దైవం ఆయనకు గొప్ప గొప్ప మహత్యాలను అనుగ్రహించాడు. ఆయన దైవాజ్ఞతో మృతులను బ్రతికించేవారు, అంధులకు, కుష్టురోగులకు స్వస్థత చేకూర్చేవారు. ప్రజలు రేపటి కోసం ఏమి దాచివుంచారో కూడా ఆయన తెలిపేవారు. ఇటువంటి అనేక మహిమలను అల్లాహ్, ఈసా (అలై)కు అనుగ్రహించాడు.

ఒకసారి హజ్రత్ ఈసా (అలై) ఓ శిష్యుడ్ని వెంటబెట్టుకొని ఎక్కడికో వెళ్తున్నారు. దారిలో ఒక చోట ఆగవలసివచ్చింది. ఆయన దగ్గర మూడు రొట్టెలున్నాయి. ఆయన తన శిష్యుడితో మాట్లాడుతూ, "మన దగ్గర మూడు రొట్టెలున్నాయి. ఒకటి నేను తింటాను. ఒకటి నువ్వు తిను. ఒకటి రేపటి కోసం

వుంచు" అని చెప్పి తను ఒక రొట్టె తిన్నారు. తిన్న తర్వాత ఆయన సెలయేటి దగ్గరకు వెళ్ళారు. నీరు త్రాగి తిరిగి వచ్చేసరికి ఒక్క రొట్టె కూడా లేదు. శిష్యుడ్ని అడిగారు మూడో రొట్టె ఏమైందని. తాను ఒక రొట్టె తిని సెలయేటి దగ్గరకు వెళ్ళి నీరు త్రాగి తిరిగివస్తుండగా ఒక మనిషి వచ్చి ఆ రొట్టె తీసుకుని పారిపోయాడని శిష్యుడు చెప్పాడు.

హజ్రత్ ఈసా (అలై)కు అల్లాహ్ గొప్ప తెలివితేటలు ఇచ్చాడు. ప్రవక్తలకయితే అందరికన్నా ఎక్కువ తెలివితేటలు ఇవ్వబడతాయి. హజ్రత్ ఈసా (అలై)కు ప్రజలు తమ ఇళ్ళల్లో భద్రపరచుకున్న వస్తువులు, నిధులను గురించి కూడా తెలుసు. అలాంటి మహత్యాలు కూడా దేవుడు ఆయనకిచ్చాడు. శిష్యుడి సంకల్పం చెడిందని హజ్రత్ ఈసా (అలై) గ్రహించారు. అతనా రొట్టెను స్వయంగా తినేసిందేకాక అబద్ధం కూడా చెబుతున్నాడు. శిష్యుడిని ఏమీ అనలేదు. మూడు ఇసుక దిబ్బలు తయారుచేసి అల్లాహ్‌ను ప్రార్థించారు. దాంతో ఆ మూడు దిబ్బలు బంగారు రాసులుగా మారిపొయ్యాయి. అప్పుడాయన శిష్యుడితో, "చూడు, మూడు బంగారపు రాసులు ఉన్నాయి. ఇందులో ఒకటి నీది, ఒకటి నాది, ఒకటి మూడవ రొట్టె తిన్నవాడిది" అని అన్నారు. ఇది వినగానే శిష్యుడికి దురాశ కలిగింది. వెంటనే అతను, "అయ్యా! మూడవ రొట్టె తిన్నది నేనే. కాబట్టి ఈ బంగారం రాసి నాకే దక్కాలి" అని అన్నాడు.

హజ్రత్ ఈసా (అలై) శిష్యుడి పేరాశకు చిరునవ్వు నవ్వారు. "సోదరా! మూడు రాసులూ నువ్వే తీసుకో. కాని ఇప్పుడిక నీకూ నాకూ పొత్తు కుదరదు" అని చెప్పి ఆయన వెళ్ళిపొయ్యారు. ఈ శిష్యుడు అక్కడే నిలబడిపొయ్యాడు. ఈ మూడు రాసుల్నీ ఎలా తీసుకువెళ్ళాలి అని ఆలోచిస్తున్నాడు. ఎవరయినా కూలివాడు దొరుకుతాడేమోనని ఎదురుచూశాడు. ఎవరూ దొరక్కపోయేసరికి ఆ రాత్రి అక్కడే జాగారం చేస్తూ ఉండిపొయ్యాడు.

ఇక చూడండి. ఆ రాత్రి నలుగురు మనుషులు అక్కడికి వచ్చారు. వాళ్ళు మూడు బంగారు రాసుల్నీ, అక్కడ పడుకున్నవాడ్నీ చూశారు. నలుగురూ బంగారం పట్ల పెంచుకున్న పేరాశతో అతడ్ని చంపేసి బంగారాన్ని చేజిక్కించు కున్నారు. తరువాత వాళ్ళల్లోవాళ్ళు కూడబలుక్కున్నారు. "ఈ మూడు బంగారు

రాసుల్ని మనం నలుగురం ఉదయాన్నే తూకం వేసి పంచుకుందాం" అని చెప్పుకొని బంగారు రాసుల దగ్గరే పడుకొని నిద్రపోయారు. ఉదయం మేల్కొన్న తర్వాత వాళ్ళకు ఆకలివేసింది. తమలో ఒకరు బజారుకు వెళ్ళి భోజనం తీసుకురావాలని, ముగ్గురు బంగారానికి కాపలాగా వుండాలని, భోజనం చేసి బంగారాన్ని పంచుకుందామని చెప్పుకున్నారు.

దాని ప్రకారం, ఒకడు భోజనం తీసుకురావడానికి బజారుకు వెళ్ళాడు. మిగతా ముగ్గురి బుద్ధులు మారిపోయాయి. అటు భోజనం తేవడానికి బజారుకు వెళ్ళినవాడికి కూడా దుర్బుద్ధి కలిగింది. ఎలాగైనా ఆ మూడు బంగారు రాసుల్నీ తానే చేజిక్కించుకోవాలనుకున్నాడు. ఆ ముగ్గుర్నీ చంపేసే ఉద్దేశంతో భోజనంలో విషం కలిపి తెచ్చాడు. బంగారు రాసుల దగ్గర కూర్చున్న ముగ్గురు మిత్రులు కూడబలుక్కొని, భోజనం తేవడానికి వెళ్ళినవాడ్ని తిరిగిరాగానే చంపేయాలని ప్లాను వేశారు. "అప్పుడు మనం ముగ్గురమే వుంటాం. రాసులూ మూడే వున్నాయి. పంచుకోవడం సులభం. తలా ఒక రాసి పంచుకోవచ్చు" అని భావించారు.

ఇక చూడండి. దైవదాసులారా! గుణపాఠం గ్రహించండి. భోజనం తేవడానికి వెళ్ళినవాడు రాగానే వాడి మీద ముగ్గురూ కర్రలతో దాడి చేసి చంపేశారు. తరువాత ముసిముసి నవ్వులతో భోజనం చేశారు. అందులో విషం వుందన్న సంగతి తెలియని ఆ ముగ్గురు మూర్ఖులు తినగానే గిలగిల కొట్టుకొని ప్రాణాలొదిలారు.

ఈ కథ చెప్పిన తరువాత పండితులవారు రాజుగారితో ఇలా అన్నారు: "ప్రశ్న అడిగిన సోదరా! చూశావు గదా! మొదట ఈసా (అలై) గారి ఒక శిష్యుడి సంకల్పం మారిపొయ్యింది. వాడి చావు వాడు చచ్చాడు. వాడి దుర్బుద్ధి మూలంగా మరో నలుగురి ప్రాణాలు పోయాయి. ఈసా (అలై) మరునాడు అక్కడికి వచ్చి చూసేసరికి బంగారు రాసుల చుట్టూ ఐదు శవాలు పడివున్నాయి. ఆయన వెంట కొందరు శిష్యులున్నారు. వారికి ఆ దృశ్యాన్ని చూపిస్తూ, "బుద్ధి పెడదారి పట్టినందువల్ల ఎంతమంది నాశనం అయ్యారో చూడండి. సంకల్ప దోషం పట్ల భయపడండి. ఎల్లప్పుడూ దైవాన్ని ప్రార్థిస్తూ వుండండి. అల్లాహ్‌ను సంకల్ప దోషం నుండి కాపాడమని వేడుకోండి" అని హితబోధ చేశారు.

ఈ ఉదాహరణ చూపాక పండితులవారు లేచి కొండపైకి వెళ్ళిపోయారు. రాజుగారు తన పరివారంతో ఇంటికి తిరిగివచ్చాడు. మేధావిని సగౌరవంగా సాగనంపాడు. పండితులవారు ఇచ్చిన ఉదాహరణను పదే పదే పరిశీలించగా సంకల్ప దోషం నుండి ఎలా కాపాడుకోవాలి అనే ప్రశ్న తలెత్తింది. మనిషి తన ఆలోచనల్ని నియంత్రించుకోవడం ఎలా? ఇలా ఆలోచిస్తూ రాజు అలసిపొయ్యాడు. ఓ పట్టాన సమాధానం దొరక్కపోయేసరికి ఆ మేధావిని మరొకసారి పిలిపించి ఆయన ముందు ఈ ప్రశ్న వుంచాడు. మేధావి రాజుగార్ని తిరిగి పండితుడి దగ్గరకు తీసుకువెళ్ళాడు. పండితులవారు ఫలానా రోజు కొండ దిగి వస్తారని, ఫలానా వేళకు ప్రసంగం చేస్తారని వారికి తెలుసు కదా! అందుకని ఆ రోజుకి ముందు రోజే సాయంత్రం వేళకు ఆ కొండ దగ్గరకు చేరుకున్నారు.



## దైవ భీతి

మరునాడు ఉదయం పండితులవారు కొండ దిగివచ్చి ఉపన్యసించారు. తర్వాత ప్రజలు ప్రశ్నలు అడిగారు. పండితులవారు అందరి ప్రశ్నలకు జవాబిచ్చిన తర్వాత రాజు ఇలా అన్నాడు: "అయ్యా! నేనొక విషయం అడగాలనుకుంటున్నాను. కాని అంతకుముందు నా పరిచయం చేసుకుంటాను. ఇంతకు పూర్వం మీ ఉపన్యాస సభలో పాల్గొన్నాను. నేనడిగిన ఒక ప్రశ్నకు తమరు ఒక నీతి కథ ద్వారా బహు చక్కగా సమాధానమిచ్చారు. దైవభక్తుడా! నేనీ దేశానికి రాజును. మీ ప్రసంగం, మీరు చెప్పిన నీతి కథ విని గొప్ప పాఠం గ్రహించాను. సంకల్ప దోషం వల్ల దేశంలో కలహాలు, కల్లోలాలు చోటు చేసుకుంటాయి. కల్లోల కారకులను నేను గనక పట్టుకోగలిగితే జైలుకు పంపగలను. ఒక మనిషి చుట్టుప్రక్కల రక్షకభటులు లేకుంటే, చూసేవాడూ, పట్టుకునేవాడూ ఎవరూ లేకపోతే సంకల్పం ఎలా అదుపు చేయబడుతుందో నాకు అర్థం కావటం లేదు. ఇక నేనయితే రాజును. జైలుకు పోతానన్న భయం నాకు లేదు. నా సంకల్పాన్ని ఏ విధంగా చక్కబర్చుకోగలనంటారు?

రాజుగారు ఈ ప్రశ్నవేసి పండితుని వంక చూడసాగాడు. చాలా మంది ఈ ప్రశ్నకు జవాబు వినాలని ఉత్సుకతతో వున్నారు. వెళ్ళిపోదాం అనుకున్నవారు కూడా ఆగిపోయారు. పండితులవారు ఈ ప్రశ్నకు కూడా జవాబుగా ఒక నీతి కథను వినిపించారు. అందులో ఆద్యంతం నీతి, గుణపాఠాలే వున్నాయి. ఆయన ఇలా చెప్పాడు:

"రాజా! నీవు చాలా మంచి ప్రశ్న వేశావు. నీవు రెండోసారి ఇంత దూరం ప్రయాణం చేసి వచ్చావు అంటే నీవు గొప్ప సత్సంకల్పం గల రాజువని అర్థమవుతోంది. సరే విను! నేనొక కథ చెబుతాను. దాన్ని విన్న తర్వాత మనిషి సంకల్పాన్ని ఎలా చక్కబరచుకోవచ్చో నీవు బాగా అర్థం చేసుకుంటావు. వీళ్ళంతా కూడా గ్రహించగలరు.

దైవదాసులారా! వినండి. పూర్వకాలంలో ఒక చక్రవర్తి వుండేవాడు. ఆ కాలంలో ఆయనకంటే గొప్ప చక్రవర్తి ఎవరూ లేరు. అతనిని ఎదిరించేవాడు గానీ, అతడేమయినా చెడ్డ పని చేస్తే ఆపగలిగే, అతడ్ని శిక్షించగలిగే మొనగాడుగానీ ఎవరూ లేరు.

ఆ కాలంలోనే ఒక గ్రామంలో ఓ అందమైన అమ్మాయి వుండేది. ఆ అమ్మాయిని మించిన సౌందర్యరాశి మరెవరూ లేరని చక్రవర్తికి తెలిసింది. అతనామె అందచందాలను గురించి విని ఆమె పట్ల వ్యామోహం పెంచుకున్నాడు. ఆ అమ్మాయిని తన వద్దకు తీసుకురమ్మని సిపాయిలను ఆజ్ఞాపించాడు. సిపాయిలు వెళ్ళి ఆ అమ్మాయిని తీసుకువచ్చారు. చక్రవర్తి ఆజ్ఞాపించగానే ఆ అమ్మాయిని ఒక మహలులోనికి తీసుకువచ్చారు. ఆ రాత్రి అతను ఆ అమ్మాయి దగ్గరకు వెళ్ళి మీద చెయ్యి వెయ్యబోయాడు. అప్పుడా అమ్మాయి, "ప్రభూ! మహలు ద్వారాలన్నీ మూయించండి, ఎవరయినా చూస్తారు" అని అన్నది. దానికి చక్రవర్తి, "ద్వారాలన్నీ మూయబడే వున్నాయి" అని అన్నాడు.

"లేదు ప్రభూ! నాకు భయంగా వుంది. ఇంకా ఒక ద్వారం తెరవబడే వుంది. చూసేవాడొకడు అక్కడ్నుంచి చూస్తున్నాడు" అన్నది ఆ అమ్మాయి.

చక్రవర్తి ఆశ్చర్యపోతూ, "ఇంకా ఏ ద్వారం తెరవబడివుంది? చూసేవాడు ఇంకెవడున్నాడు ఇక్కడ?" అని అడిగాడు.

"ప్రభూ! యావత్తు ప్రపంచాన్ని సృష్టించిన దేవుడు డెబ్బయి పరదాల చాటున వున్నదాన్ని కూడా చూడగలుగుతాడు. ఆయన నుండి ఏదీ మరుగున లేదు. మీరు నాతో "ఈ నిషిద్ధకార్యం" చేసినట్లయితే, ప్రళయదినాన ఆ ప్రభువు మిమ్మల్ని తప్పక శిక్షిస్తాడని నేను భయపడుతున్నాను. విశ్వప్రభువు పట్టు నుండి ఎవరూ తప్పించుకోలేరు. అంతటి శక్తిమంతుడు ఆయన" అన్నది ఆ అమ్మాయి.

ఈ సమాధానం విని చక్రవర్తి వణికిపోయాడు. "నిజంగా దేవునికి బహిరంగంగా ఉన్న, గోప్యంగా ఉన్న ప్రతి విషయం తెలుసు. మన సంకల్పాలు, మన అంతరంగాల్లో మెదిలేవి అన్నీ ఆయనకు తెలుసు. అలాంటి అద్భుత శక్తిమంతుడితో నేను పోరాడలేను" అన్న ఆలోచనతో చక్రవర్తి ఠక్కున ఆగిపోయాడు. అతనిలో అమితమైన దైవభీతి జనించింది. ఆ అమ్మాయి జోలికి పోకుండా పశ్చాత్తాపంతో పాపమన్నింపు కోసం దైవాన్ని ప్రార్థించసాగాడు.

పండితులవారు ఈ కథ చెప్పి, "రాజా! ప్రజలారా!! వినండి. దేవుని పట్ల, అంతిమదినం పట్ల విశ్వాసాన్ని గుర్తుంచుకుంటే మన ఉద్దేశాలు, సంకల్పాలు సక్రమంగా ఉంటాయి. దైవభీతే మనిషిని చీకటి గదిలో ఉన్నా, ఒంటరిగా అడవిలో ఉన్నా పాపం చేయనీయకుండా ఆపుతుంది.

ఇలా చెప్పి పండితులవారు కొండపైకి వెళ్ళిపోయారు. రాజుగారు తన పరివారంతో రాజధానికి తిరిగి వచ్చి మేధావితో ఇలా అన్నాడు: "మీరు మా వెంటే వుండి, మాకు దైవాదేశాలను గుర్తుకుతెస్తూ వుండాలని మా కోరిక. దైవం తలిస్తే నేను ఇక నుండి పండితులవారిని కలుసుకుంటూ ఉంటాను. దైవభీతి ప్రాతిపదికపై జీవితం గడుపుతాను. నేనీ విధంగా జీవితం గడిపినట్లయితే దాని ప్రభావం ప్రజలపై కూడా పడుతుంది. తద్వారా ప్రజల సంకల్పాలు వారి అదుపులో వుంటాయని ఆశించవచ్చు."

ఇక చెప్పేదేముంది. రాజుగారి రాజ్యంలో మంచివాళ్ళు, నీతిమంతులు తయారయ్యారు. వారిని చూసిన ఇతరులు కూడా సన్మార్గంలో నడవసాగారు.

అయితే విచారకర విషయమేమంటే, రాజుగారు చనిపోయాక రాజ్యాధికారం దైవభీతి లేనివాళ్ళ చేతుల్లోకి పోయింది. వారు దేవుని ఉనికినే తిరస్కరించారు. ఫలితంగా దేశం నలువైపులా కల్లోలం, సంక్షోభం చెలరేగింది. ప్రజలు కష్టాల పాలయ్యారు. దేవుని శరణు! ఇప్పుడు కష్టాలను దూరం చెయ్యడానికి పథకాలపై పథకాలు రచిస్తున్నారు. కాని కష్టాలు మాత్రం పెరుగుతూనే పోతున్నాయి. అందరూ వలలోపడ్డ పక్షుల్లా విలవిలలాడుతూ వలను ఛేదించాలని చూస్తున్నారు.

ఫ తబిరూ యా ఊలిల్ అబ్సార్



# గుర్తుంచుకోవలసిన విషయాలు

ఈ శీర్షికలోని నాలుగు కథలు రూపుదిద్దుకుంటున్న సమయంలో ఒక భావన పదే పదే మనసులో మెదలసాగింది. ప్రజలలో చాలా మంది పుణ్య కార్యాలు చేస్తూ కనబడతారు. వారిని మంచి వైపునకు పురిగొల్పే విషయం ఏమిటి? ఉదాహరణకు ఈ క్రింది సంఘటన చదవండి. ఆ తర్వాత ఆలోచించండి.

ఒక త్రాగుబోతు సారాయి త్రాగటానికి వెళుతున్నాడు. అతని జేబులో బాగా డబ్బుంది. దారిలో ముసలమ్మ ఈడు వచ్చిన తన కూతురితో నిలబడి, "సోదరులారా! దైవం మీకు మేలు చేయుగాక! ఈడు వచ్చిన నా ఈ కూతురి వివాహం చేసి పుణ్యం కట్టుకోండి. ఈ అమ్మాయికి యజమానీ, వారసులు ఎవరూ లేరు" అని యాచిస్తోంది.

యుక్తవయస్కురాలు, అందులోనూ ఆమెకు యజమానీ, వారసులు ఎవరూ లేరు. వారు ఇల్లు దాటి వచ్చారు. ఇదొక ప్రమాదం. ఇటువంటి ప్రమాదం వల్ల మరిన్ని ప్రమాదాలు జరుగుతాయి. అలాగే జరిగింది. ఒక దుర్మార్గుడు ఆ అమ్మాయి మీద చెయ్యివేశాడు. సరిగ్గా అదే సమయానికి

తాగుబోతు అటుగా వచ్చాడు. అతడు ఆ దుర్మార్గుడిని ఎత్తి కాలువలో విసిరాడు. తన జేబులో వున్న డబ్బంతా ముసలమ్మకు ఇచ్చి సారాయి బట్టీ వైపునకు మరలాడు. ఇప్పుడతని జేబు ఖాళీ అయింది. త్రాగాలన్న కోరిక ఒకవైపు పట్టి లాగుతోంది. జేబు వెనక్కి లాగుతోంది. అదే త్రాగుబోతు చిల్లర వస్తువులు అమ్ముకునేవాడి నుండి పది రూపాయల నోటు కొట్టేశాడు.

చూశారా! ఒకే మనిషిలో రెండు భిన్నమైన వైఖరులు ఎలా ఉన్నాయో. ఇంతకూ ముసలమ్మ పట్ల అతడు అవలంబించిన వైఖరికి ప్రేరణ ఏమిటి? అన్న ప్రశ్న ఉదయిస్తుంది. దానికి జవాబు ఇది. అల్లాహ్ ప్రతి మనిషినీ సాధు స్వభావంగల వానిగానే పుట్టించాడు. ఈ సాధుస్వభావం దుష్కార్యాల కారణంగా అణగివుంటుందికాని, పూర్తిగా అణగారిపోదు. ఒక్కోసారి అది అకస్మాత్తుగా పెల్లుబుకుతుంది. అప్పుడేదయినా సత్కార్యం జరిగితే జరిగినట్లు, లేకపోతే తిరిగి అణగిపోతుంది. దాన్నే "మానవత్వం" అని కూడా అంటారు.

ఇదే సాధుస్వభావం లేక మానవత్వాన్ని దృష్టిలో పెట్టుకొని మనిషికి సరయిన శిక్షణ ఇవ్వడం జరిగితే అతనిలో సత్కార్యాలు చేసే అలవాటు జనిస్తుంది. అన్నివేళలా నీతిమంతుడిగా కనిపిస్తాడు. సరయిన శిక్షణ కోసం దైవభీతి, పరలోకంలో దేవుని ముందు మన కర్మలకు లెక్క చెప్పుకోవలసివస్తుందన్న జవాబుదారీ భావనలతో కూడిన విశ్వాసం మనిషిలో ఉండాలి. ఈ విశ్వాసమే మానవతా వికాసానికి తోడ్పడుతుంది; మనిషిని మానవుడిగా మలుస్తుంది.

"ఒక మనిషి - రెండు వైఖరులు" అనే ఈ పుస్తకం మనిషిని నిజమైన మానవుడిగా రూపొందించడానికే వ్రాయబడింది. ఇక దీని ద్వారా పాఠకులు కోరుకున్నంత ప్రయోజనం పొందవచ్చు.

"వమా తౌఫీఖ ఇల్లా బిల్లాహ్" (అల్లాహ్ సద్బుద్ధి నివ్వుగాక!)

